నమః పరమర్షిభ్యః.

# వేదసంగ్రహము.

మేలు వలయువానికి నది నెందుటకుం గీడుం
దొలగించుటకును సాధనములివి యని శబ్దప్రమాణం
బు. దక్క నెఱుంగరాని సాధనంబు లలౌకికంబులు
అవియె ధర్మాధర్మములు- వానినెఱింగించు ప్రమాణప్ర
మాణము వేదము ననునది- అది సంస్కృతభాషలో
నున్నది- మిక్కిలి పురాతనము- అపౌరుషేయము.
పురుషనిర్మితము గానిచో నది యెట్లు కలిగె
నన శంక తోచును- ఈశ్వర ప్రసాదంబున మన పూ
ర్వులగు ఋషులకు స్వయంప్రాప్తమయ్యెనని యెఱుం
గునది- అందువలననే దీనికి నిందు కర్త యని యె
ఱుంగువారెవరును గానరారు- అట్లున్నచో నెవ్వ
రనియు దెలుపకుందురే- కావున నే మంత్రద్రష్ట
లు ఋషులని పూర్వగ్రంథములం గానవచ్చుచున్నది.
మంత్రకృత్తులని కొన్నిచోటుల ఋషులు నె
ప్పంబడిరి గాని యెవరును వానిని నిర్మించిరని యర్థం

ప్రత్యక్షేణానుమిత్యా వా యస్తూపాయో న బుధ్యతే।
ఏతం విదన్తి వేదేన తస్మాద్వేదస్య వేదతా॥

౫- అవి వారు తపోబలంబునం బ్రత్యక్షీకరిం చుటయును అవి యితరశబ్దంబులతో సమానములు గానున్నను దపఃప్రసన్నుండగునీశ్వరునియనుజ్ఞను ఋషులముఖముల నుచ్చరింపఁబడుటనే మంత్ర ములగుటయు నవి నియమపూర్వకముగా నుకన్న స్వర వర్ణోచ్చారణాదులు లేకుండ నుచ్చరించిన మంత్రత్వము గలుగదు గాన నిన్నియుం గాపాడుట యునట్లు సెప్పుటకు హేతువు.

ఈశ్వరప్రసాదంబు వడసినవారు సేసిననేమి అవిమనకు కార్యకరంబగుట చాలదాయనిశంక పుట్టును-అవునువారల తపఃప్రభావంబుందప్పి సన్నీశ్వరశక్తియు నెంతయుం జాలును- గాని వేదమునందే ఋషులీయీసూక్తములను సాక్షాత్కరించిరనివాతరశనాఇత్యాద్యనువాకములయందుఁగానవచ్చుచున్నది-ఇంతియుకాక అగ్నిర్మూర్ధాయనునీశ్వరరూపప్రదర్శకమంత్రములలో వేదములీశ్వరుని వాక్కులని తెలుపబడినవి- ఇట్లుండఁగా వారలుచేసిరనుటకెవ్వరు సాహసింపంగలరు.

ఇంతియకాక- అస్యమహతో భూతస్య యి నుశ్రుతివేదము లీశ్వరునియూర్పులని చెప్పుచున్నది

అదియీశ్వరహృదయమూలకములని తాత్పర్యమం
దెలుపుచున్నది- అవిపురుషబుద్ధిమూలకములేయ
యినచోనీశ్వరహృదయామూలకము లెట్లగును.

వేదము సంస్కృతభాషలో నున్నదను నియ
మమేమి- ఇతరభాషలయందు నుండరాదాయని శంకిం
తురు. అందుకుఁ జెప్పెదము అతిపురాతనమును అత్యు
త్కృష్టమునగు గ్రంథమట్టిభాషలోనుండుటయే యు
క్తమని బుద్ధిమంతులూహింపవచ్చును. సంస్కృత
భాష యతిపురాతనంబగుటయు నత్యుత్కృష్టంబగు
టయు భాషానివేకపండితులందఱు నొప్పుకొనుచు
న్నారు.

ఇతరభాషలలోఁబుట్టిన గ్రంథములను వేదంబు
లనికొందఱు వ్యవహరించుటకుమూలము వైదికదేశా
ర్థములం జెప్పువాక్యములందుండగా నవచ్చుటయే- ఆ
వ్యవహారములౌపచారికము- భారతము పంచమవేదమ
నుటయునట్లు.

వేదము ప్రథమభాషంబుట్టెననుటకు మఱియొ
క్క హేతువుఁగలదు- ఈశ్వరుఁడు మున్నానామవ్య
సర్వేషాంతు సనామాని కర్మాణిచ పృథక్పృథక్ । వేద
శబ్దేభ్యఏవాదౌ పృథక్సంస్థాశ్చనిర్మమే. ౧అ౨౧శ్లో

వహారంబులం బుట్టించునప్పుడు వేదశబ్దంబులనే ప్ర
ట్టించెనని మన్వాదిస్మృతులం గానవచ్చుచున్నది-శ్రు
తము భాష దేవభాష గానిచో నవి యెట్లున దర్శించుచు.

అయినను యోబ్రహ్మాణమ్ అను శ్రుతిలో నీశ్వ
రుండు మున్నుగా బ్రహ్మం బుట్టించి వానికి వేదముల
నుపదేశించునని చెప్పంబడినదిగదా ఋషులకుఖం
బున నావిర్భవించెననుట యెట్లని శంకదోఁచును-ఏ
నుండు బ్రహ్మశబ్దము వేదప్రతిపాదకమగుచు లక్ష
ణచే వేదప్రవర్తకుండగు పురుషునిం జెప్పును-ఋ
షిశబ్దంబునట్లు- ఋషులను ఖ్యాతులుగా నాయామంత్రం
బులను మున్నెవ్వని ముఖమున వినఁబడెనో వానికి వాఁ
డు బ్రహ్మయనియు ఋషియనియుం జెప్పంబడును-
కావుననే కశ్యపాదులుగూడ బ్రహ్మలనంబడిరి-ఇది
శ్రుతిలోనే బ్రహ్మమును మున్నుగాఁ బుట్టించుచున్నాఁ
డు వానికుపదేశించుచున్నాడని యిట్లు వర్తమాననిర్దే
శమునను సూచింపఁబడినవి.

ఒక్కప్పుడు యీవద్వేదవచనములను సృష్ట్యాది
నొక్క పురుషునకుపదేశించెనని యనండె బ్రహ్మాయ

---

యుగాన్తేన్తర్హితాన్ వేదాన్త్సేతిహాసాన్మహర్షయః।
లేభిరే తపసా పూర్వమనుజ్ఞాతాః స్వయంభువా.

దిగాదని యర్థము. ఆమ్నాయమనంగాఁ బారంప
ర్యోపదేశంబునం బఠింపంబడుచున్నదని యర్థము.

ఇది మూలప్రమాణము గావుననే దీనికి విరుద్ధ
ములగు స్మృతిపురాణాదివచనంబులు సైతమప్రమా
ణంబులనియు శ్రుతివచనంబులలో ద్వైధము గానవ
చ్చినచో వికల్పంబని తెలియవలయుననియు మన్వాది
స్మృతులం దెల్లను.

ఇట్టి వేదము ప్రమాణమనుటకేమి ప్రమాణము
నిశంకదోచును. ఈ వేదమునందలి మంత్రములయ
థావిధిగా నభ్యసించి దానింబట్టి యీశ్వరప్రసా

ధర్మంజిజ్ఞాసమానానాం ప్రమాణం పరమం శ్రుతిః।
శ్రుతిద్వైధంతు యత్రస్యాత్తత్ర ధర్మావుభౌ స్మృతౌ॥
మను॥ ౨ అ. ౧౩ శ్లో.

శ్రుతిస్మృతివిరోధేతు శ్రుతిరేవగరీయసీ। అవిరోధే స
దా కార్యం స్మార్తం వైదికవత్సదా॥ జాబాలిః.

పితృదేవమనుష్యాణాం వేదశ్చక్షుస్సనాతనం। అశ
క్యంచాప్రమేయంచ వేదశాస్త్రమితిస్థితిః। యావేద
బాహ్యాస్స్మృతయో యాశ్చకాశ్చ కుదృష్టయః। స
ర్వాస్తానిష్ఫలాః ప్రేత్య తమోనిష్ఠాహితాస్స్మృతాః॥
మను॥ ౧౨ అ.

దంబువడసిన మహాత్ముల ప్రభావంబులును వారిసచ్చరి
త్రంబులును ప్రభావశీలురగు పూర్వపురుషులఁ ద
మవాక్యములం గొనియాడుటయును ముఖ్యప్రమాణ
ములు- అందుకుం బ్రమాణమేమన్నను సావధానము
గా నాకలింపుఁడు.

ఆప్రత్యక్షముగా నడచిన కార్యములను వ్యవ
హారంబున నెట్లు గనుఁగొనుచున్నారు- ప్రధానము
గా లిఖితసాక్ష్యములందు కాధారములు- ఉ. ఒక్క
నికి వేఱొక్కఁడు ఋణమిచ్చెననుటకు నప్పుడు వ్రా
సిన సాక్షులున్నప్పటి లిఖితంబునుంబట్టియది నిశ్చయిం
పవచ్చును- ఆలిఖితంబునా సాక్షుల మాటలును నిజ
మనుటకు దానికి బలవంతమగు బాధకము లేకుండుట
యే చాలును.

ఒక్కప్పుడందుకు విపరీత లిఖితసాక్ష్యములు
తటస్థించినచోనని నిజమగుటకుం బ్రబలసాధకము
లుండవలెను- లిఖితకాలమున నడచిన వ్యాపారంబు
లును వానితోఁ జేరిన జనులను నేమియు నెఱుంగక
త్రోవం బోవుచు నదియసత్యమని చెప్పుచో వారిసా
క్ష్యములు నట్టివారలతోఁ జేరిన లిఖితంబు నుప్పన
క్కైనం బనికివచ్చునే- ఇది జ్ఞాపకముగనుంగొనుఁడు.

(సంస్కృతములో మనవేదవ్యవహారములు నడ
చినకాలము బహుదూరము- అదిగనుంగొనినవారీవ
రుసలోనివారిప్పటిపండితులిప్పటికినున్నారు- ఆవ
రుసలోని పండితులొనర్చిన గ్రంథములు ననేకము
లున్నవి- అవియన్నియు సాధకంబులుగావే.

అయిన నిప్పటిభాషాంతరపాఠశాలలం జది
విన గ్రొత్త బుద్ధిమంతులు మనవేదమును వేదప్రవర్తకు
లను నిందించుచున్నారు గాన నది విరుద్ధసాక్ష్యము
గాదా యనిభావించెదరు.

వీరు పూర్వకాలవృత్తాంతము నెఱుంగరు.
ద్వీపాంతరము వారు మనవేదమును దత్ప్రవర్తకుల
చరిత్రంబును మోసంబులని చెప్పిన నది విశ్వసించి వీ
రుచెప్పుచున్నారు- ద్వీపాంతరమువారలు మనపూ
ర్వవృత్తాంతంబు లెఱింగినవారి వరుసలోనివారు గా
రనుటకుం గూడసాక్ష్యంబు వేయునే- వారుబుద్ధిమం
తులుగారో అట్టూరక యేలచెప్పెదరని శంకదో
చును- మనభూఖండము సకలంగాలవశంబున సంప్రా
ప్తంబగు దౌర్భాగ్యంబునం బ్రాప్తంబగు విద్యావిహీ
నతంగలుషమతులయి పాండిత్యాభినయము లంజేయు
వారి యసందర్భోక్తులు విని యీప్రదేశంబుననున్న

వారెల్ల నిట్టివారనియు నింతకును నున్న నిచ్చటన ప
లునిట్టి వారేయనియు నొక్కయవిశ్వాసవాశన పట్టి
ననాదృష్టితో మనపూర్వగ్రంథంబులలోఁ గొంపగొం
తెంజూచుచు నాపాత్రపతీతార్థంబులంజూచి వాని
గంభీరతాత్పర్యంబులం దెలియఁజాలక మీదిమిక్కి
లి యవ్యాసన బలపరచికొనుచుందమభాషలో నే త
ద్దూషణగ్రంథములంజేయుట యూ నిచ్చటిమహాపండి
తులితరభాషలనైనంగమిని వారిట్టిమాటలు వ్రాసినది
గూడ నేలంగమియు నిట్టిమోహలోపప్రస్తరించుటకుం
గారణములయి నవియని లెస్సగా విచారింపుఁడీ.

ఇంతియగాక కొందఱుశిక్షితులైయును నన్యదే
శభాషలయందును స్వపూర్వజనులయందును మను
కారప్రాబల్యంబున వారిగ్రంథంబులెట్టివయినను వా
నియం దొక్క విశ్వాసంబును తద్విరుద్ధగ్రంథముల
యందనాదరంబును గలుగుటఁజూచుచున్నాము. త
మగ్రంథములం దెలియకయె యితరమత గంథముల
గుణదోషముల విమర్శింపకయె త్రోవంబోవు వాని
మాటలవిశ్వసించితమపూర్వులననాదరించుచుపశుప్రా
యులిందుకును వెలియగుచున్నారు.

వారిమాటలంబట్టి మనమింత ప్రయాసము

జెప్పవలసిననిమిత్తంబులేకున్ననువిమర్శించుప్రాజ్ఞుల కు సంశయము నివారించుట యావశ్యకంబుగా ననాపాతప్రతీకంబులగువిరోధములం బరిహరింపుచుదీనివృత్తాంతంబులం దెలుపుచున్నాము.

కాఠకము కాలాపకము పైప్పలాదకము మాహులుకుని యిట్లువేద శాఖా నామంబులు గలవు- అందువలన కఠాదులు తత్కర్తలోకో యని శంకింతురు. శ్రీ వేదవ్యాసులవలననుక్తోక్త వేదముం బఠించిన వైశంపాయనాదులవలన సంతయుం బఠింపంజాలకనుకొక్క శాఖ బఠించి వానిప్రవచనంబులం జేసినవారిం బట్టియా నామంబులు గలిగెనని పురాణప్రసిద్ధము.

కొన్నిచోటులం బ్రావాహణియగుపవరుండనియుక్తానుకుని నెవ్వనినో చెప్పుచున్నదని భ్రమముపుట్టును- పవరయనిధ్వనింపుచుం బ్రవహించు వాయువని యర్థము గాని యాధునిక పురుషుండర్థము గాదని వివరింపంబడియున్నది.

కొన్నిచోటుల వనస్పతులు సత్రయాగము జేసెననియు సర్పంబులట్లు సేసెననియుం జెప్పంబడియున్నది- అది యున్మత్తవాక్యమువలెనున్నదనిశం

కదోఁచును- వృద్ధులు సర్పములంబోలువారునయి తము సత్ప్రయోగములఁజేసి ఫలసిద్ధింగాంచిరి ప్రాజ్ఞు లట్లు చేసినం జెప్పవలసినదియే యని వాని తాత్పర్యము.

ఇదియంతయుం బూర్వమీమాంసం దెల్పును.

ఇట్లపౌరుషేయంబగు వేదము మంత్రమును బ్రాహ్మణంబునని రెండువిధములనున్నది- అందుఁ గర్మ ప్రయోగములఁ దత్సంస్మృతికై యుచ్చరింపంబడునది మంత్రము- దానికిఁ బర్యాయంబులు మను బ్రహ్మ శబ్దములు- మంత్రార్థంబును మంత్రసాధ్యకర్మ విధులుం దెలుపునది బ్రాహ్మణము- అది విధియు నర్థవాదంబును నని రెండువిధములనుండును- ఇట్లు సేయవలయు నిట్లు సేయఁగూడదనియుం జెప్పునది విధి- అది వరుసఁ బ్రవర్తనయు నివర్తనయు ననంబడును- అవియె విధినిషేధములు.

అర్థవాదమనఁగా విధినిషేధవిషయముల ప్రాశస్త్యనింద్యత్వంబులం దెలుపువాక్యము- అర్థవాదవాక్యంబులు మందబుద్ధులకు నిరర్థకంబులు నపార్థకంబులును వలెం దోఁచును- వాని తాత్పర్యములం దెలిసినవారి కట్లు దోఁపవు- ఎట్లన్నను.

బర్హిస్సున వెండియొసంగరాదని విధివాక్య

ము నెత్తు- అగ్నిరేమేధ్యాన్నైద్భుటనే రు(ద్రుండనఁబే
రుగలిగెను- కన్నీరువడిరే నదివెండియయ్యె నది
రెయొసఁగినవారి యింటివారు- సంవత్సరమునకు ము
న్నరేమేద్దురని యొక్క యర్థవాదనముగలదు.

దేవుఁడు దక్షిణ యిచ్చుచో దుఃఖకరంబగునొ
క్క వస్తువుం బుట్టింపం దలంచెనట్టి తెల్లనివస్తువు
లై నదివెండి దాని దక్షిణగా నిచ్చిన దుఃఖకరంబ
గునని దానినిఁ దక్షత్వమును దెలుపుఁగాన వెండియొ
సంగవలవదను నిషేధమునకుఁ జేలూత యిచ్చుచు
న్నది.

ప్రజాకాముఁడొండెఁ బశుకాముఁడొండెఁ
ప్రాజాపత్యతూపరపశుయాగనుఁ జేయవలయునను
విధితోఁగూడఁ బ్రజాపతి తనవపనూడఁదీసి యగ్ని
హుతంబు జేసిన నందుండి తూపరపశువుపుట్టె దా
నిచే యాగంబు సేసెనని యర్థవాదంబు నుపినవ
చ్చుచున్నది- ఆది దేవుఁడు దనయభీష్టప్రదానసం
కల్పమునకు నొక్క హిరణ్యరూపయాగంబు గో
చరించెనట తూపరపశుయాగంబయ్యెనని దాని ప్రా
శస్త్యంబు దెలుపుంగాన తూపరపశు యాగవిధికిం
జేలూత యిచ్చుచున్నది.

అర్థవాదంబుల కెల్లనిట్టి తాత్పర్యము లూహిం
చునట్లు శాబర భాష్యాదులయందు మార్గప్రదర్శనము
సేయంబడినది.

అయిననిట్లు దెలుపవలయునది దుఃఖాకరం
బుగాన దానిదక్షిణగా నొసంగఁబడని గూ నిదన
త్సల్ప్రవదముగా నదీసం జేయవలయుననియు నిట్టు
లన్నం జాలదాయని శంకతోచును. వినుండు ఈ
శ్వరుండు ఋషులకు వేదవాక్యంబుల నావిర్భవిం
పించినదియెట్లంటేని. తపస్సమాధియుక్తచోస్వప్న
ములవలె నొక్కదశం గలిగించియందుం దెలిపినవికొ
న్ని. అప్రయత్నముగా నోటరాపలికించి కొన్ని.
అశరీరముగా వినిపించినవికొన్ని. అందుస్వప్న సదృ
శజ్ఞానంబువనిట్లు సేయవలయునని యొండెట్లు సే
యవలవదని యొండె నొక్కపురుషుండు చెప్పినట్లు
విధినిషేధములం దెలుపుటయును. వాని ప్రాశస్త్య
నింద్యత్వంబులం దెలియుటకు నొక్కవృత్తాంతంబు
దెలుపుటయునగుచో నవ్వృత్తాంతములనెల నడచిన
దినడచినట్లు ప్రామాణికులగు మహర్షులు వాక్యరూ
పంబున సంగ్రహించి విధులతోఁ జేర్చియున్నారు.
అవియె యర్థవాదంబులు.

ఈశ్వరుఁడు మనజన్మాంతరాదృష్టవైచిత్ర్యమునను సృష్టించునప్పుడు భవిష్యచ్ఛుభాశుభములను తత్సూచకప్రతినిధిస్వప్నాంతర్ముఖమునఁ దెలుపుటయను భవసిద్ధము- అయినను స్వప్నములన్నియు నట్టివి గావు- కాని తపస్స్వాధ్యాయము సంగలిగినవి యవశ్యము భవిష్యత్సూచకములగుట నియతము గావున వికర్తవ్యాకర్తవ్యనిశ్చయముఁ జేయుటకే పుట్టినట్లు నిశ్చితములు.

ఇందు మంత్రములు శబ్దప్రధానములు- అందు అర్థము శబ్దాఙ్గము- విధ్యర్థవాదరూపమగు బ్రాహ్మణము అర్థప్రధానములు- శబ్దము తదఙ్గము- కావున నామంత్రబ్రాహ్మణాత్మకమగు వేదము నిత్యముఁ బఠింపుచుండుచో సుకృష్టు డనుపపత్తి సంభవించినచో మంత్రభాగమయినం బఠించినం జాలును.

మంత్రములు ఋగ్యజుస్సామంబులని మూఁడు విధములు-. అందుఁ బాదవిభాగము గలది ఋక్కు- వాక్యరూపము యజుస్సు- గానరూపమయినది సామ

---

యథోదితేన విధినా నిత్యం ఛన్దస్కృతం పఠేత్। బ్రహ్మ ఛన్దస్కృతం చైవ ద్విజో యుక్తో హ్యనాపది॥ మను॥ ౪అ॥ ౧౦౦శ్లో॥

మును.

మంత్రములకెల్ల ఋషిచ్ఛందోదైవతములు దె
లియుట యావశ్యకము. ఆమంత్రము ప్రథమము
న సాక్షాత్కరించువాఁడు దానికి ఋషి. అక్షరసం
ఖ్య ఛందము. మంత్రప్రతిపాద్యము దైవతము. అ
గ్నివరుణేంద్రబ్రహ్మవిష్ణురుద్రాదిరూపములనేక వి
ధదేవతలు వేఱు వేఱుగా మంత్రములఁ గానవచ్చు
చున్నారు గాని యన్నిమంత్రములు నొక్క యీశ్వ
రునిఁ జెప్పుననురహస్యము దేవతాసంగ్రహమునఁ దె
లుపఁబడును.

మంత్రద్రష్టలగు ఋషులు వేఱువేఱుగాఁ దత్త
త్కాలములఁ బుట్టినను బూర్వపూర్వఋషిసాక్షాత్కృ
తములు సంప్రదాయక్రమమున నుత్తరోత్తరఋ
షులధ్యయనము సేయుచును స్వతఃప్రభావప్రస
న్నేశ్వరప్రసాద సాక్షాత్కృతములగు మంత్రాంత
రంబులుం గూర్చి పఠించుచుండగా నేక గ్రంథంబయి
శ్రీవేదవ్యాసునివఱకువచ్చెనతండటపయి వారట్టిమ
హాగ్రంథము పఠించి ధరించుట యశక్యంబని చింతిం
చి ఋగ్యజుస్సామాథర్వవేదములని నాల్గువిభాగము
లం జేసి వేఱువేఱుగా శిష్యులకుపదేశించె నటపయి

నదియుంగష్టంబనితలంచి పైవారిచే శాఖోపశాఖలు
గా విభజింపంబడినది- కాలక్రమమున ననేకశాఖ
లుత్పన్నంబు లయ్యెనిప్పుడు స్వల్పభాగములున్ననవి
సేయితసు పఠించువారయుదైయున్నారు.

ప్రతిశాఖకును భాగంబులు రెండుగలవు-అందు
లోంబూర్వభాగము కర్మ ప్రతిపాదకము- ఉత్త
రభాగము బ్రహ్మవిద్యాప్రతి పాదకము- అదియే వే
దాంతంబనియు నుపనిషత్తనియుం జెప్పంబడును.

ఇట్టిమహాత్త్వంబుగల వేదంబునకంగోపాం
గంబులుగాఁ బ్రసిద్ధవిద్యలు లెక్కింపంబడినవి- వా
నిస్వరూపంబులు విద్యాసంగ్రహంబునం దెలుపం
బడును- దీనియధ్యయననియమాదుల ధ్యయనసం
గ్రహమునందెలుపంబడును.

ఇదిశ్రీపరవస్తు వేంకటరంగాచార్య
లయ్యవారలుంగారిచేరచియింపంబ
డిన వేదసంగ్రహము.

ప్రింటర్ అ॥చ।శ్రీనివాసాచార్యులు. ౧౮౭౨ సం॥

